ఓం నమో నారాయణాయ.



# గీతాసంగీతము

## శ్రీమద్భగవద్గీత

(ద్వితీయాధ్యాయ తోహరాగానము.)



కృతికర్త:

శ్రీ సేగు సంజీవినారాయణదాసుగారు.



ప్రకాశకులు:

శ్రీమతి టి. వి. రాజహంసమ్మగారు,

సేలం జిల్లా, పాలతాబాద్, (కృష్ణగిరి.)

భక్తులకు ఉచితముగా యివ్వాబడును.

A Raghavachar
A రాఘవాచార్యులు.



ఓం శ్రీసద్గురవే నమః.

## గణేశప్రార్థన.

శ్రీగణనాథుని నెప్పుడు బాగుగ
మదిలోన పఠన చేయుచు నుండిన్,
రాగద్వేషము లెల్లను వేగముగా
వూడి ధరలో దలదల రాలున్.

## సరస్వతీ ప్రార్థన.

సరస్వతిదేవిని భక్తి అనే విద్య ఇమ్మని వేగమె కోరండీ।
సరస్వతిదేవియే సర్వులకునూ భక్తిని నొసగును గనుకొనుడీ॥
సరస్వతిదేవిని వేడుచు నుండిన సౌఖ్యము కలుగును విడువకుడీ।
సరస్వతిదేవిచే భాగ్యము గలుగును జ్ఞానము వేగమె కోరండీ॥

## శ్రీ సద్గురుధ్యానము.

ఓం గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః।
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః॥

ఓం అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరం।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః॥

ఓం బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యం।
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి॥

ఓం అసతో మా సద్గమయ। తమసో మా జ్యోతిర్గమయ।
మృత్యోర్మా అమృతం గమయ॥

ఓం సహనావవతు సహనౌభునక్తు సహవీర్యం కరవావహై।
తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై॥
ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.



## అథ శ్రీ మద్భగవద్గీతా మాహాత్మ్యమ్.

ధరోవాచ = భూదేవి ఇట్లనెను —

శ్లో॥ భగవన్! పరమేశాన! భక్తిరవ్యభిచారిణీ।
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో!॥ ॥౧॥

విష్ణురువాచ = విష్ణువిట్లనెను —

శ్లో॥ ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతస్సదా।
సముక్తస్సుఖీలోకే కర్మణా నోపలిప్యతే॥ ॥౨॥

## ఋ ష్యా ది న్యా సః.

ఓం అస్య శ్రీ భగవద్గీతాశాస్త్రమహామంత్రస్య, భగవాన్ వేదవ్యాసఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీకృష్ణపరమాత్మా దేవతా.

ఓం అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ఇతి బీజం, సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ఇతిశక్తిః. అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ ఇతికీలకమ్.

## అ థ క ర న్యా సః.

నైనం ఛిందన్తి శస్త్రాణి నైనం దహతి పావక
ఇత్యంగుష్ఠాభ్యాం నమః।

న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుత
ఇతి తర్జనీభ్యాం నమః ।
అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్యఏవచేతి
మధ్యమాభ్యాం నమః ।
నిత్యస్సర్వగతఃస్థాణురచలోఽయం సనాతన
ఇత్యనామికాభ్యాం నమః ।
పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథసహస్రశ
ఇతి కనిష్ఠికాభ్యాం నమః ।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచేతి
కరతల కరపృష్ఠాభ్యాం నమః ।

## అ థ హృ ద యా ది న్యా సః

నైనం ఛిందన్తి శస్త్రాణి నైనం దహతి పావకః
ఇతి హృదయాయనమః ।
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుత
ఇతి శిరసేస్వాహా ।
అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య
ఏవచేతి శిఖాయై వషట్ ।
నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతన
ఇతి కవచాయ హుమ్ ।
పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః
ఇతి నేత్రత్రయాయ వౌషట్ ।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచేతి
అస్త్రాయ ఫట్ ।
శ్రీ కృష్ణప్రీత్యర్థే గీతాపారాయణే వినియోగః.

## ధ్యా న ము.

శ్లో॥ పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం,
వ్యాసేన గ్రథితాం పురాణామునినా మధ్యే మహాభారతమ్।
అద్వైతామృతవర్షిణీం భగవతీమష్టాదశాధ్యాయినీం,
అంబ! త్వామనుసందధామి భగవద్గీతే! భవద్వేషిణీమ్ ॥

శ్లో॥ నమోస్తు తే వ్యాస! విశాలబుద్ధే!
ఫుల్లారవిందాయతపత్రనేత్ర! ।
యేన త్వయా భారతతైలపూర్ణః,
ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః ॥

,, ప్రపన్న పారిజాతాయ తోత్రవేత్రైకపాణయే ।
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః॥

,, వసుదేవసుతం దేవం కంసచాణూర మర్దనం ।
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

,, భీష్మద్రోణతటా జయ ద్రథజలా గాంధార నీలోత్పలా,
శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా ।
అశ్వత్థామ వికర్ణ ఘోరమకరా దుర్యోధనావర్తినీ,
సోత్తీర్ణా ఖలు పాండవై రణనదీ కైవర్తకః కేశవః॥

,, పారాశర్య వచస్సరోజమమలం గీతార్థగంధోత్కటం,
నానాఖ్యానక కేసరం హరికథా సమ్బోధనాబోధితమ్।
లోకే సజ్జనషట్పదై రహరహః పేపీయమానం ముదా,
భూయాద్భారతపంకజం కలిమలప్రధ్వంసి నశ్శ్రేయసే ॥

,, యం బ్రహ్మావరుణేంద్రరుద్ర మరుతః స్తున్వంతి దివ్యైః స్తవైః
వేదైస్సాంగ పదక్రమోపనిషదైర్గాయంతి యంసామగాః।
ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యంతి యం యోగినో
యస్యాన్తం న విదుస్సురాసురగణా దేవాయతస్మైనమః॥



ఓం

శ్రీకృష్ణపరమాత్మనే నమః



# శ్రీ మద్భగవద్గీత

# గీతా సంగీతము

## (ద్వితీయాధ్యాయము – సాంఖ్యయోగము)

పల్లవి॥ శ్రీకృష్ణా జయ శ్రీకృష్ణా జయ
శ్రీకృష్ణా జయ శ్రీకృష్ణా
శ్రీకృష్ణా జయ శ్రీకృష్ణా జయ
శ్రీకృష్ణా జయ శ్రీకృష్ణా॥

తో॥ పూర్ణవిరాగము పొందగ బావకు
పూతనహారుడగు కృష్ణుండు
పూర్ణకటాక్షము నుంచియు సాంఖ్యము
బోధించెను కరుణాళుండు ॥శ్రీ॥

సంజయ ఉవాచ:-

శ్లో॥ తం తథా కృపయాఽఽవిష్టమశ్రుపూర్ణాకులేక్షణమ్।
విషీదంతమిదం వాక్యమువాచ మధుసూదనః ॥ 1

సంజయుడు చెప్పుచున్నాడు:-

తో॥ అతిదయాళుడై కన్నులనుండియు
నీరుగార్చుచును దుఃఖించు
అర్జునునిగాంచి మధుసూదనుండు
యీ రీతిగ ననె వినుమనుచు ॥శ్రీ॥

శ్రీ భగవానువాచ:-

శ్లో॥ కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్ ।
అనార్యజుష్టమస్వర్గ్యమకీర్తికరమర్జున! ॥ 2

శ్రీ భగవంతుడు చెప్పుచున్నాడు:-

తా॥ ఎయ్యెడ నీకిది దాపురించెనో
ఏల మాఢ్యమో నీకయ్యా
ఈ వైకల్యము పాపమూలమగు
నీ సంకటసమయము కాదయ్యా! ॥శ్రీ॥

శ్లో॥ క్లైబ్యం మా స్మగమః పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప!॥ 3

తా॥ హృదయదౌర్బల్యం బేటికి విడుమా
మదిదలచుము శత్రుల నురుమన్
వదలుము నీ పిరికితనమ్మును
ఇదే శరముల వారిని దునుమన్ ॥శ్రీ॥

„ పరంధాముగన రాముని మదిలో
పరిపరివిధముల స్మరియించు
నరకవాసమును గోరితివంటే
విషయవాసనల మదినెంచు ॥శ్రీ॥

„ కృష్ణాయను రెండక్షరంబులును
ద్రౌపదిమానము గాచెగదా
తృష్ణాదుఃఖము తొలగగ వలసిన
కృష్ణాయని తలపగరాదా ॥శ్రీ॥

అర్జున ఉవాచ:-

శ్లో॥ కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన!।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన॥ 4

అర్జునుడు చెప్పుచున్నాడు:-

తో॥ పితామహుండగు భీష్మునిమీదను
యాచార్యుండౌ ద్రోణునిపై
బాణంబుల నెటు ప్రయోగించెదను
పూజార్హులె హా వారలపై ॥శ్రీ॥

శ్లో॥ గురూనహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహ లోకే।
హత్వార్థకామాంస్తు గురూనిహైవ
భుఞ్జీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్॥ 5

తో॥ మహానుభావులు భీష్మద్రోణులు
సుఖభోగముకై వధింపక
భిక్షాటనమున బ్రతుకగ వచ్చును
వారల రక్తము పడనీక ॥శ్రీ॥

శ్లో॥ న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః।
యానేవ హత్వా న జిజీవిషామః
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥ 6

తో॥ మనకు జయంబో వారికి జయమో
యెరుగము మనకే జయమైనా
వ్యాకులజీవన మవునుగాని
సుఖలేశము గనబడదే కృష్ణా ॥శ్రీ॥

శ్లో॥ కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః।
యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥ 7

తా॥ కార్పణ్యము నా భావం బడచెను
ధర్మనిశ్చయము తెలియదుగా
ఎది శ్రేయస్కరమగు నద్దానిని
తప్పక నీవిక దెల్పుముగా ॥శ్రీ॥

శ్లో॥ న హి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోకముచ్ఛోషణమింద్రియాణామ్।
అవాప్య భూమావసపత్నమృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్॥ 8

తా॥ ఇంద్రియసంతాపకరంబౌ దుఃఖము
దేవేంద్రత్వము వచ్చినను
శత్రుహారణమై రాజ్యమొచ్చినను
ఈ దుఃఖము నే పడజాలన్ ॥శ్రీ॥

సంజయ ఉవాచ:—

శ్లో॥ ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః।
న యోత్స్య ఇతి గోవిందముక్త్వా తూష్ణీం బభూవ హ॥9

తా॥ ఈరీతిగ కృష్ణునితో బల్కియు
యుద్ధముచేసిన కష్టమగున్
దురితము వచ్చును గోవిందా యని
యూరకనుండెను అర్జునుడున్ ॥శ్రీ॥

శ్లో॥ తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత!।
సేనయోరుభయోర్మధ్యే విషీదంతమిదం వచః॥ 10

తా॥ విషాద మొందియు సేనమధ్యమున
యూరకుండు పార్థుని గనియు
హృషీకేశుడును పరిహాసముగా
బలికెను భారతవసల యనియు ॥శ్రీ॥

శ్రీ భగవానువాచ:-

శ్లో॥ అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూనగతాసూంశ్చ నానుశోచంతి పండితాః॥ 11

భగవంతుడు చెప్పుచున్నాడు:-

తో॥ అనవసరముగా నేల నేడ్చెదవు
వివేకివలెనే బల్కెదవు
ఉన్నవారికిని చచ్చినవారికి
నేడ్వరు యార్యులు విను నీవు ॥శ్రీ॥

,, ఆత్మారాముని యనుదినంబును
సత్పురుషులు ధ్యానించెదరు
పుత్రాదులె గతియని పాపాత్ములు
భ్రాంతిచె తహతహ పడియెదరు ॥శ్రీ॥

శ్లో॥ న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః।
న చైవ న భవిష్యామః సర్వే వయమతః పరమ్॥ 12

తో॥ నేను నీవు యీ రాజులందరును
యెప్పుడు నుండెడి వారమయా
మనకందఱకును బుట్టుట
పెరుగుట జచ్చుట లనునవి లేవయ్యా ॥శ్రీ॥

శ్లో॥ దేహినోఽస్మిన్యథా దేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాంతరప్రాప్తిర్ధీరస్తత్ర న ముహ్యతి॥ 13

తో॥ బాల్యము యౌవన జరావికారము
గలుగు నట్లు దేహాంతరమున్
గలిగిన యాత్మకు మార్పులు లేవని
ధీరుడు ధైర్యము నొందు కడన్ ॥శ్రీ॥

శ్లో॥ మాత్రాస్పర్శాస్తు కౌంతేయ! శీతోష్ణసుఖదుఃఖదాః।
ఆగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత!॥ 14

తా॥ ఇంద్రియలోలత గలుగుచుండుగద
సుఖదుఃఖంబులు భువిలోనన్
ఇవి శాశ్వతములు గాదని దెలియుము
వీటి సహించుము మదిలోనన్ ॥శ్రీ॥

శ్లో॥ యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ!।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే॥ 15

తా॥ పురుషశ్రేష్ఠుడు సుఖదుఃఖములకు
చలనమునొందని వాడుగదా
ధీరుడు మోక్షము నొందుట కర్హుడు
నాత్మజ్ఞానము వలనెగదా ॥శ్రీ॥

శ్లో॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః ॥ 16

తా॥ ఆత్మవేత్తల యభిప్రాయమువలె
లేనివస్తు వెప్పుడులేదు
ఆత్మస్వరూపం బెప్పుడు మారదు
కావున దుఃఖము పనిలేదు ॥శ్రీ॥

శ్లో॥ అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్।
వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి॥ 17

తా॥ సత్తనబడు యే బ్రహ్మముగలదో
సర్వప్రపంచ వ్యాప్తంబై
నిత్యంబై వెలుగుచుండు నెవరికి
నాశము చేయ నసాధ్యంబై ॥శ్రీ॥

శ్లో॥ అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః।
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత!॥ 18

తా॥ ఆత్మనిత్యుడగు నాశరహితుడగు
నప్రమేయుడగు శరీరము

నిత్యము గాదిది యని తత్త్వజ్ఞులు
యనెదరు విను జేయుము యుద్ధం ॥శ్రీ॥

శ్లో॥ య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్।
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే॥ 19

తో॥ ఎవ్వం డాత్మను జంపెద ననునో
శత్రువుచే జచ్చెద ననునో
వారలిద్దరును దెలియరు ఆత్మను
జంపుట జచ్చుట లేదనుకో ॥శ్రీ॥

శ్లో॥ న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః।
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥ 20

తో॥ పుట్టుట గిట్టుట నెప్పటికినిలే
దవ్యయు డజుడు పురాణుండు
దేహము నష్టము పొందుచుండినను
శాశ్వతంబుగా తానుండు ॥శ్రీ॥

శ్లో॥ వేదాఽవినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్।
కథం స పురుషః పార్థ! కం ఘాతయతి హంతి కమ్॥ 21

తో॥ ఆత్మ వినాశములేనివాడనియు
పరిణామమ్మును లేదనియున్
అజు డవ్యయు డనువా డెటు జంపును
యెటు జంపించును తెలిసియును ॥శ్రీ॥

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ॥ 22

తా॥ పురుషుడు చినిగిన వస్త్రములను విడి
నూతనము ధరియించునుగా
ఆరీత్యాత్మయు శిథిలము వదలియు
నూతనదేహము ధరించుగా ॥శ్రీ॥

శ్లో॥ నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః।
న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః॥ 23

తా॥ ఆయుధములు కత్తిరింపజాలవు
దహింపజాలదు యగ్నియును
జలములు దడుపవు యీ యాత్మను విను
వాయువు శోషింపదు గనుము ॥శ్రీ॥

శ్లో॥ అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ।
నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః॥ 24

తా॥ ఈతని నరుకగ దహింప తడుపగ
శోషిలజేయగ గాదండ్రు
ఈతడు నిత్యుడు సర్వగతుడు స్థాణుడు
అచలుండును సనాతనుండు ॥శ్రీ॥

శ్లో॥ అవ్యక్తోఽయమచింత్యోఽయమవికార్యోఽయముచ్యతే।
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి॥ 25

తా॥ అవ్యక్తుండని యచింత్యుడనియును
యవికార్యుండని బలికెదరు
కావున యర్జున! యిట్లెఱింగియును
శోకము విడువుము పలుమారు ॥శ్రీ॥

శ్లో॥ అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్।
తథాఽపి త్వం మహాబాహో! నైనం శోచితుమర్హసి॥

తా॥ దేహము బుట్టిన యాత్మపుట్టునని
దేహముగిట్టిన గిట్టునని

తలచిన దుఃఖము బొందగనేలా
పుట్టెడు గిట్టెడు దానికిని ॥శ్రీ॥

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ।
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి ॥ 27

తో॥ పుట్టినంతనే మృత్యువు దృఢమగు
మరణించిన జన్మము దృఢము
అట్లనివార్యంబగు దానికి నిక
శోకించుటచే నేమి ఫలమ్ ॥శ్రీ॥

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత!।
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా ॥ 28

తో॥ బంధుగులగు నీ భూత సమూహము
పుట్టక మును పవ్యక్తంబు
మధ్యకాలమున కనబడు కడపట
కనపడ దెందుకు దుఃఖంబు ॥శ్రీ॥

శ్లో॥ ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః।
ఆశ్చర్యవచ్చైనమన్యః శృణోతి
శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥ 29

తో॥ ఆశ్చర్యముగా జూచునొకం డది
యాశ్చర్యంబని పలుకునుగా
మరియొక డాశ్చర్యంబని వినును
ఆత్మను వీరలు తెలియరుగా ॥శ్రీ॥

శ్లో॥ దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత!।
తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి ॥ 30

తో॥ సర్వదేహముల నుండెడు నాత్మయు
నా దేహంబులు బోయిననూ

సర్వాత్మకు డెప్పుడు తానుండును
దుఃఖము మెందుకు పార్థ! విను ॥శ్రీ॥

శ్లో॥ స్వధర్మమపి చావేక్ష్య న వికంపితుమర్హసి ।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే॥

తో॥ పరమార్థంబును విచారించినను
యుద్ధముతో తొలగుట కాదు
క్షత్రియులకు యుద్ధమె ప్రాముఖ్యము
మోహాదుల చేర్చగ నలదు ॥శ్రీ॥

శ్లో॥ యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్।
సుఖినః క్షత్రియాః పార్థ! లభంతే యుద్ధమీదృశమ్॥ 32

తో॥ యుద్ధభూమియే స్వర్గద్వారమై
తెరువబడిన వాకిలిగలది
ధర్మయుద్ధమును తప్పక జేయుము
కోరక దనంత వచ్చినది ॥శ్రీ॥

శ్లో॥ అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ।
తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి॥ 33

తో॥ విధిచోదితమగు ధర్మయుద్ధమును
విడుచుట నెంతయు బనిగాదు
స్వధర్మమును విడ పాపము కలదు
కీర్తియు ధర్మము నిలబడదు ॥శ్రీ॥

శ్లో॥ అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్।
సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే ॥ 34

తో॥ రణము చేయనని తొలగిన నీ కిల
యపకీర్తియు గల్గును చాలు
గన్నవారలును దూలనాడుదురు
అంతకన్న మరణము మేలు ॥శ్రీ॥

శ్లో॥ భయాద్రణాదుపరతం మన్యంతే త్వాం మహారథాః।
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్॥

తా॥ భయముచేత యుద్ధము మానితివని
పరిహాసింప బడెదవు వినుము
బంధువులకునై విరమించితివని
మహారథులు తలపరు నిజము ॥శ్రీ॥

శ్లో॥ అవాచ్యవాదాంశ్చ బహూన్వదిష్యంతి తవాహితాః।
నిందన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ॥ 36

తా॥ నీ శత్రువులును నిను గని యవాచ్య
వాక్యము లనెదరు చులకనగా
ఓ శత్రుంజయ! నెటు సహించెదవు
దుఃఖము వేరేమున్నదిగా ॥శ్రీ॥

శ్లో॥ హతో వా ప్రాప్స్యసే స్వర్గం
జిత్వా వా భోక్ష్యసే మహీమ్।
తస్మాదుత్తిష్ఠ కౌంతేయ!
యుద్ధాయ కృతనిశ్చయః॥

తా॥ హతుడవైనచో స్వర్గమొందెదవు
రాజ్యమొందెదవు జయించినన్
అందువలన ధైర్యమున యుద్ధమును
నిశ్చయించు నీ మనంబునన్ ॥శ్రీ॥

శ్లో॥ సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి॥38

తా॥ సుఖదుఃఖంబులు సమముగ జూచుచు
లాభాలాభము జయాజయమ్
అఖిలము సమముగ జూచుచు యుద్ధము
జేయుము పాపము బొందకుము ॥శ్రీ॥

శ్లో॥ ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబంధం ప్రహాస్యసి॥39

తో॥ ఆత్మతత్త్వమును దెలియుటకును నే
దెలిపితిని బుద్ధియోగమును
తత్త్వము దెలిసియు కర్మవిషయమయి
బుద్ధిని దెల్పెద పార్థ! విను ॥శ్రీ॥

శ్లో॥ నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥

తో॥ ఆత్మజ్ఞానము పూర్తిస్థితికై
కర్మయోగమును దెలిపెదను
ఈ తత్త్వజ్ఞానముచే విఫలము
బొందక భయమును విడనగును ॥శ్రీ॥

శ్లో॥ వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునందన!।
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్॥

తో॥ నిశ్చయాత్మకంబయిన బుద్ధియును
బురుషార్థకసాధన మనుమా
నిశ్చయాత్మకము లేని బుద్ధియును
బురుషార్థంబును లేదనుమా ॥శ్రీ॥

శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్యవిపశ్చితః।
వేదవాదరతాః పార్థ! నాన్యదస్తీతి వాదినః॥ 42

తో॥ మోదుకవృక్షము పుష్పించిన గని
భ్రమపడు నట్లవివేకజనుల్
వేదవాదులును బల్కుచు నుందురు
స్వర్గమె మేలని పలుమార్లు ॥శ్రీ॥

శ్లో॥ కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్।
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి॥ 43

తో॥ భోగైశ్వర్యంబులకొఱకై యప్పుడు
స్వర్గముబొందగ వలెననుచు
భాగ్యములెల్లను పొందెడివారలె
యిహలోకంబున సుఖులనుచు ॥శ్రీ॥

శ్లో॥ భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసాం।
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే॥ 44

తో॥ ఇంద్రియసుఖములకై భోగంబుల
కాశపడిన మానవులకును
తొందరచే వ్యవసాయములేమిని
నిశ్చలబుద్ధియు లేదు విను ॥శ్రీ॥

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున!।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥45

తో॥ త్రిగుణాత్మకమై వెలయును వేదము
నిస్త్రైగుణ్యుడ వగుమయ్యా
శుద్ధసాత్వికుడవయి శీతోష్ణము లాది
యోర్చుకొను చుండుమయా ॥శ్రీ॥

శ్లో॥ యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥ 46

తో॥ జలపూర్ణంబగు కూపంబున
కాజలమునుండి గల ఫలమేమీ
జ్ఞానప్రాప్తియును గలవానికి
యా కర్మకాండ నిచ్చెడిదేమీ ॥శ్రీ॥

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన।
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి॥ 47

తా॥ కర్మజేయ నీకధికారమె యగు
ఫలమును గోరుటకును లేదు
కర్మఫలము గోరిన జన్మంబగు
కర్మలచేయను యనరాదు ॥శ్రీ॥

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ!
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥

తా॥ ధనంజయా! విను యోగస్థుడవై
కర్మ చేయు హరి ప్రీతిగను
సిద్ధ్యసిద్ధులలో సమచిత్తుడవై
యుండుటె యోగంబనబడును ॥శ్రీ॥

శ్లో॥ దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ!
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥ 49

తా॥ సమబుద్ధియె యుత్కృష్టం బనదగు
దానికి కర్మలు గన కీలు
అట్టి కర్మలను జేసెడివారలు
ధనంజయా! విను దీనులు ॥శ్రీ॥

శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే।
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥

తా॥ సమత్వబుద్ధిని బొందిన ధన్యుడు
పుణ్యపాపముల బోదోలు
క్రమముగ సమత్వబుద్ధిని బొందుము
కర్మయోగమున నిది మేలు ॥శ్రీ॥

శ్లో॥ కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః।
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్॥ 51

తా॥ బుద్ధియుక్తులగు సార్థకజన్ములు
కర్మఫలంబుల విడిచియును

జననమరణ బంధనముల జిక్కక
బొందెద రవ్యయ పదంబును ॥శ్రీ॥

శ్లో॥ యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి।
తదా గన్తాఽసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥ 52

తే॥ ఎవ్వరి బుద్ధియు మోహపంకిలము
లేక శుద్ధముగ నిలిచినదో
అవ్వీరుడు వైరాగ్య మొందు
తా విన్న కన్న గడచినదానిలో ॥శ్రీ॥

శ్లో॥ శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా।
సమాధావచలా బుద్ధి స్తదా యోగమవాప్స్యసి॥ 53

తే॥ వేదములో బల్కిన వాక్యంబులు విని
తహతహ పడు బుద్ధియును
సదమలజ్ఞానముచే విషయంబుల వదలిన
యాత్మపదంబును గనును ॥శ్రీ॥

అర్జున ఉవాచ:-

శ్లో॥ స్థితప్రజ్ఞస్య కా భాషా? సమాధిస్థస్య కేశవ!
స్థితధీః కిం ప్రభాషేత? కిమాసీత? వ్రజేత కిమ్?॥ 54

అర్జునుడు చెప్పుచున్నాడు:-

తే॥ స్థితప్రజ్ఞు భాషణమెట్టిదియో
సమాధి కేశవ! యెట్టిదియో
స్థితప్రజ్ఞుడును యేవిధిబల్కునో
యెట్లుండెట్లు చరించునయా ॥శ్రీ॥

(స్థితప్రజ్ఞుని లక్షణములు)

శ్రీ భగవానువాచ:-

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ! మనోగతాన్।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥ 55

శ్రీ భగవంతుని సమాధానము:-

తో॥ మనసున గలిగెడు సర్వకార్యములు
సంపూర్ణముగా విడచియును
తనయందే తా సంతసిల్లుటయె
స్థితప్రజ్ఞతని యనబడును ॥శ్రీ॥

శ్లో॥ దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః।
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే॥ 56

తో॥ దుఃఖమబ్బుచో మనసు చలింపదో
సుఖమబ్బిన యాశయు బడదో
రాగము భయమును క్రోధము లేదో
వాని స్థితప్రజ్ఞు డనరాదో ॥శ్రీ॥

శ్లో॥ యః సర్వత్రానభిస్నేహ స్తత్తత్ ప్రాప్య శుభాశుభం।
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 57

తో॥ ఎవనికి నేమిట నాశములేదో
శుభాశుభ విమర్శన లేదో
అవమానము మానంబులు లేవో
యతని స్థితప్రజ్ఞు డనరాదో ॥శ్రీ॥

శ్లో॥ యదా సంహరతే చాఽయం కూర్మోఽంగానీవ సర్వశః।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 58

తో॥ తాబే లేవిధి తన యవయవముల
భయమున లోపల జేర్చుకొను
అట్లు విషయవిరక్తి నింద్రియముల
మరల్చు ప్రజ్ఞావంతుడును ॥శ్రీ॥

శ్లో॥ విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥ 59

తా॥ నిరాహారునకు విషయము లణగును
విషయము లందలి రాగమును
పరమార్థము చక్కగ దెలిసినచో
రాగములంతట బాసి చను ॥శ్రీ॥

శ్లో॥ యతతో హ్యపి కౌంతేయ! పురుషస్య విపశ్చితః।
ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥ 60

తా॥ కుంతీతనయా! వివేకి కైనను
ప్రబలమైన యింద్రియసుఖముల్
వంతువేసుకొని బలత్కారమున
మనసును లాగును పలుమార్లు ॥శ్రీ॥

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః।
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 61

తా॥ ఆ యింద్రియముల వశపరచుకొనుచు
వాసుదేవుడా నాయందే
బాయని భక్తిని మనసును జేర్చిన
ప్రజ్ఞాయుతుడా యిహ మందే ॥శ్రీ॥

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే।
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥

తా॥ విషయంబుల ధ్యానించు చుంటచే
వానియందె సంగము గల్గు॥
విషయసంగమున కామముగల్గును
కామముచే క్రోధము గల్గు ॥శ్రీ॥

శ్లో॥ క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి॥ 63

తా॥ క్రోధముచే మోహమ్ము గల్గును
అందుచేత స్మృతి నాశమగున్

దాన బుద్ధియును నాశంబగుగా
అందువలన బురుషుడు మ్రొగ్గుర ॥శ్రీ॥

శ్లో॥ రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి॥ 64

తా॥ రాగద్వేషంబులు లేకుండెడి
భోగంబులు భోగించియును
రాగముతో మనసును తనయాత్మను
బొందించుచు శాంతిని బొందుర ॥శ్రీ॥

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే॥ 65

తా॥ ఎవ్వనిచిత్తము శాంతినిబొందిన
సర్వదుఃఖములు బోవుగదా
అవ్వీరుని చిత్తప్రసాదమును
యాత్మాకారమై నిలుచుగదా ॥శ్రీ॥

శ్లో॥ నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా।
న చాభావయతశ్శాన్తి రశాన్తస్య కుతస్సుఖమ్॥ 66

తా॥ చిత్తస్థైర్యము లేని వానికిని
బుద్ధిలో నాత్మయు గనబడదు
యుత్తమబుద్ధి గతించిన భావము
సుఖము శాంతు లసలే లేదు ॥శ్రీ॥

శ్లో॥ ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి॥ 67

తా॥ ఇంద్రియములు విషయము జేరిన
మనసు వానివెంబడి జనిన
ఆత్మాకారప్రజ్ఞ నశించును
జలమందలి యోడను వోలెర ॥శ్రీ॥

శ్లో॥ తస్మాద్యస్య మహాబాహో! నిగృహీతాని సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 68

తా॥ ఓ మహాబాహు విషయధ్యానము
విడిపించియు విష్ణువునందు
తన మనస్సు జేర్చిన ఘనుడౌ గద
బుద్ధియు నిలుచును నాయందు ॥శ్రీ॥

శ్లో॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥ 69

తా॥ సర్వప్రాణుల కప్రకాశమై
నది జ్ఞానికి వెలుతురు నగును
సర్వప్రాణికి ప్రకాశమయినది
జ్ఞానికి వెలుతురు లేనిదగున్ ॥శ్రీ॥

శ్లో॥ ఆపూర్యమాణమచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్ ।
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తిమాప్నోతి న కామకామీ ॥ 70

తా॥ సర్వనదులు తనలో జేరినను
జేరక నిలిచిన సముద్రము
గర్వపడుట తగ్గుటయును లేదో
అటు జ్ఞానియు తలపడు కామమ్ ॥శ్రీ॥

శ్లో॥ విహాయ కామాన్యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః॥
నిర్మమో నిరహంకార స్స శాంతిమధిగచ్ఛతి ॥ 71

తా॥ యెవడు విషయముల పరిత్యజించియు
నిస్పృహుడై తానుండ గనున్
ఏ వికార మమకారము లడచిన
యాతడు శాంతిని బొందు విను ॥శ్రీ॥

శ్లో॥ ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి ।
స్థిత్వాఽస్యామన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥ 72

తా॥ ఇదియే పార్థా! బ్రాహ్మీస్థితి విను
యీ స్థితిబొందిన మరలడుగా
అంత్యకాలమున యీస్థితి బొందిన
బ్రహ్మానందము నొందునుగా ॥శ్రీ॥

ఓం తత్సదితి శ్రీ మద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున
సంవాదే సాంఖ్యయోగో నామ
ద్వితీయోఽధ్యాయః .

శ్రీ వ్యాసప్రోక్తమైన శతసహస్రగ్రంథసంహితంబగు శ్రీ మహా
భారతంబను సంహితయందు భీష్మపర్వంబున శ్రీ కృష్ణా
ర్జున సంవాదరూపంబను యోగ శాస్త్రంబును
బ్రహ్మ విద్యాబోధకంబునగు శ్రీ మద్
భగవద్గీతలను ఉపనిషత్తులయందు
సాంఖ్యయోగంబనం బరగు
ద్వితీయాధ్యాయము
ముగిసెను.



# శ్రీ శ్రీ శ్రీ సద్గురుస్వామి ప్రార్థన.



తో॥ సాంఖ్యయోగతత్త్వంబును దెలిపియు
సద్గురువర శ్రీ శామయ్యా
సంఖ్యలేని జన్మంబుల బుట్టెడి
దుఃఖంబులు బాపితివయ్యా ॥శ్రీ॥

„ ప్రకృతివిలక్షణ పరమాత్మహరే
ప్రకృతికి బలమగు శ్రీ కృష్ణా!
నీ కృప గలుగక నిను గనజాలము
నిగమగోచరా హరికృష్ణా! ॥శ్రీ॥

„ పరమేశ్వర నిను పరిపరివిధముల
భజించు భక్తుడు శ్రీ కృష్ణ!
పరవశమున ప్రాపంచిక నడతలు
మరచితె నేమగు హరికృష్ణా! ॥శ్రీ॥

„ ఆకాశాదిగ పంచభూతములు
అంతట నిండియె యున్నావు
ఆకాశాదుల కాధారుడవై
అచ్యుత నన్నిటి నడిపెదవు ॥శ్రీ॥

„ యశోదనందన! యాదవోత్తమా!
శాశ్వతపదవిని నాకిమ్మా
కిశోరకృష్ణా! కువలయపాలన!
నిను జేరగ నా మనసిమ్మా ॥శ్రీ॥

„ నీభజనమె యనుకూలము కృష్ణ!
నీస్మరణమె ముఖ్యము కృష్ణా!
నీ కథ శ్రవణానందము కృష్ణ!
నీవే మము నేలుము కృష్ణ! ॥శ్రీ॥

ఇట్లు,
పేగు సంజీవనారాయణదాసు.

## పాఠాంతధ్యానము.

ఓం గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥
ఓం అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరం ।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥
ఓం బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్వమస్యాదిలక్ష్యం ।
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥
ఓం అసతో మా సద్గమయ తమసో మా జ్యోతిర్గమయ ।
మృత్యోర్మా అమృతం గమయ ॥
ఓం సహనా వవతు సహనౌభునక్తు సహవీర్యం కరవావహై ।
తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై ॥
ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥
ఓం సర్వేషాం స్వస్తిర్భవతు । ఓం సర్వేషాం శాంతిర్భవతు.
ఓం సర్వేషాం పూర్ణం భవతు । ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.
ఓం మంగళం గురుదేవాయ మహనీయగుణాత్మనే
సర్వలోకశరణ్యాయ సాధురూపాయ మంగళం.

అబ్ తేరెశివా - అను రాగము.

మాత నీకు (జయ) వందనంబు - మంగళారతీ
మమ్ములనూ బ్రోవవమ్మ మర్మముదెలిపీ ॥మా॥
కామితార్థంబులన్ని కడకుద్రోసియూ
కనికరముగ మమ్ములనూ కాపాడుమా ॥మా॥

బంధపాశంబులందు భ్రమలువీడినా
నీ భక్తులై నవారలను ఆదరించుచూ ॥మా॥
పరులని మదినెంచకనూ బాగుపడుటకై
పరమాత్మ స్వస్వరూపమును బాగుగనేర్పి ॥మా॥
పతిసేవయే పణతులకును భాగ్యమనుచునూ
పతిపాదముల్ పూజించుచు భాగ్యశాలివై ॥మా॥
ప్రతిదినమును భగవద్గీత సంతసంబునా
పదునెనిమిది అధ్యాయముల్ పఠనచేయుచూ ॥మా॥
మంగళంబు మాత నీకు మంగళారతీ
మగువలందరుగూడి మంగళారతీ.

## శ్రీ మహాలక్ష్మ్యష్టకమ్.

(ప్రతి శుక్రవారమునందు సాష్టాంగ నమస్కారములతో పఠించవలెను.)

1. నమస్తేఽస్తు మహామాయే శ్రీపీఠే సురపూజితే।
శంఖచక్రగదాహస్తే మహాలక్ష్మి నమోఽస్తు తే॥
2. నమస్తే గరుడారూఢే కోలాసురభయఙ్కరి।
సర్వపాపహరే దేవి మహాలక్ష్మి నమోఽస్తు తే॥
3. సర్వజ్ఞే సర్వవరదే సర్వదుష్టభయంకరి।
సర్వదుఃఖహరే దేవి మహాలక్ష్మి నమోఽస్తు తే॥
4. సిద్ధిబుద్ధిప్రదే దేవి భుక్తిముక్తిప్రదాయిని।
మంత్రమూర్తే సదా దేవి మహాలక్ష్మి నమోఽస్తు తే॥
5. ఆద్యన్తరహితే దేవి ఆదిశక్తి మహేశ్వరి।
యోగజ్ఞే యోగసంభూతే మహాలక్ష్మి నమోఽస్తు తే॥
6. స్థూలసూక్ష్మమహారౌద్రే మహాశక్తి మహోదరే।
మహాపాపహరే దేవి మహాలక్ష్మి నమోఽస్తు తే॥

7. పద్మాసనస్థితే దేవి పరబ్రహ్మస్వరూపిణి ।
పరమేశి జగన్మాతః మహాలక్ష్మి నమోఽస్తు తే ॥

8. శ్వేతాంబరధరే దేవి నానాలంకార భూషితే ।
జగత్ స్థితే జగన్మాతః మహాలక్ష్మి నమోఽస్తు తే ॥

మహాలక్ష్మ్యష్టకం స్తోత్రం యః పఠేద్భక్తిమాన్నరః ।
సర్వసిద్ధిమవాప్నోతి రాజ్యం ప్రాప్నోతి సర్వదా ॥

10. ఏకకాలే పఠేన్నిత్యం మహాపాపవినాశనం ।
ద్వికాలం యః పఠేన్నిత్యం ధనధాన్యసమన్వితః ॥

11. త్రికాలం యః పఠేన్నిత్యం మహాశత్రువినాశనం ।
మహాలక్ష్మీర్భవేన్నిత్యం ప్రసన్నా వరదా శుభా ॥

ఇన్ద్రకృత శ్రీ మహాలక్ష్మ్యష్టకస్తోత్రం
సంపూర్ణం.





శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, చిత్తూరు.

# శ్రీనివాసాశ్రమములో

## దొరకు గ్రంథములు.



| | | వెల రూ. అ. పై. |
|---|---|---|
| 1. గీతాసంగీతము | ... | 4—0—0 |

భగవద్గీత 18 అధ్యాయములకున్ను శ్లోకం 1-కి 2 దోహరాల తోను; తాత్పర్యముతోను కూడినది. చక్కని క్యాలికో బైండు.

| | | |
|---|---|---|
| 2. ప్రార్థనామంజరిః | ... | 1—8—0 |
| 3. శ్రీకృష్ణార్జున ప్రశ్నోత్తరములు (12-వ అధ్యాయము.) | | 0—5—0 |
| 4. భజగోవిందము | ... | 0—2—0 |
| 5. శ్రీనివాసనామావళి | ... | 0—3—0 |

మఱియు అనేక వేదాంతగ్రంథములున్ను, ఆశ్రమమునకు సంబంధించిన అనేక గ్రంథములున్ను దొరకును.

---

విలాసము:—

శ్రీ సేగు కృష్ణదాసుగారు,
శ్రీనివాసాశ్రమం, అగరంపోస్టు, (కోలారుజిల్లా.)

శ్రీ వేదవ్యాస ప్రెస్, చిత్తూరు.